పద్ధతి ననుసరింపనివారిని బహిష్కరించుట వారితో సహాయ నిరాకరణ మొనరించుట యనునవి లక్షణములుగా నున్నవి.

ఇటలీలో ఫాసిస్టు క్రొత్త సాంఘిక విధానము ఏర్పడుటకు పద్ధతులే సాధనమార్గములుగా కలిగి ప్రబలుచున్నది. కాని హిందూదేశములో స్త్రీలును పురుషులును నేర్చుకొనుచున్న విషయమేమనగా — తాము స్వేచ్ఛగా నుండగోరిన యెడల సజ్జనులై యుండవలెననియే.

అయితే గాంధిగారిని మోచికొని యాడుచున్నటువంటి ఇక బ్రిటిషు గవర్నమెంటువారు తమ మాటలను ముల్లెలను చేతబుచ్చుకొని ఛాంఛాయిదేశములో ఓడనెక్కి అచటనున్న వ్యాయామశాస్త్ర అధికారులు, పోలీసు ఉద్యోగులు, సోల్జర్లు యావన్మందియు ఆ కాలుదేరి రావలయుననియు భారతీయులకు తమ గతి తామే సాధించుకొనుటకు విడిచి రావలయుననియు నా యభిప్రాయము కాదు. ఈ పశ్చిమ ఖండములోనివారే గాక నిజముగా క్రైస్తవ సల్లక్షణ సమన్వితులైన వారికి తన యీ భారత జాతికి సహాయము చేయుటకై గాంధిగారు మార్గమును కల్పించుచున్నారని మాత్రము చెప్పగలము. "ఆదరకన్న తాను విపాద వసెడి భావము మానవునకు కలిగినచో అతనికి మోక్షము లేదు" అని గాంధి సదా భావించును తన యాత్మగతిని తానే విమర్శించుకొనుచుండును. అట్టి గాంధి మహాత్ముని గూర్చియు కోట్లకొలది జనులు పూజించెడి యీ ప్రజానాయకుని గూర్చియు, అసత్య ప్రకటనలు గావించువారుగాని అయిన నిజ స్వభావమును గణింపకుండ నుండరాదని మా యభిప్రాయము. "అందరికన్న తాను తక్కువవాడననెడి భావము తనకు కలిగిననేగాని అతనికి మోక్షము లేదు" — యీ వాక్యములను రాజకీయ వేత్తయగు ఏ యూరోపియుడు సభా వేదిక పై నెక్కి పలుక గలడు! కాని యీ వాక్యములు ఇదివరకు ఉచ్చరింపబడినవే.

(అ॥ గ్ర॥)

## ఫార్మింగ్ అసోసియేషన్

(వ్యవసాయపు సంఘము)

నైసెల ౩ వ తేదిన ఫార్మింగ్ అస్సోసియేషన్ కమిటీ జరిగెను. అందు దిగువ విషయములు ఆలోచింపబడెను,—

౧ ఈ సంఘపక్షమున ఇంగ్లీషు ఉర్దు భాషలలో పత్రిక ప్రకటించవలయును. వ్యవసాయ శాఖాధ్యక్షుల పత్రిక ప్రచురణకై రు ౧౫౦౦ లను దీనికై యుపయోగించవచ్చును. ఈ పత్రికయందు నిజాంరాష్ట్రపు రైతుల సమస్యలను వ్యవసాయశాఖవారి పర్యటనములు, లెక్కలు మున్నగునవి ప్రకటించవలయును.

౨ ఈ సంఘసభ్యులను వ్యవసాయ ఫారములలో జరుగు ప్రదర్శనముల (Demonstrations) కాహ్వానించవలయును.

౩ వ్యవసాయశాఖవారు ఈ సంఘసభ్యుల భూముల నే క్రొత్త పద్ధతిపై సేద్యము చేయుటకు గైకొనవలయును.

౪ వ్యవసాయశాఖ మంచి విత్తనములు సంపాదించవలయును. ఈ విత్తనములనే ఈ సంఘసభ్యుల కిచ్చునట్లు ప్రోత్సహించవలయును.

౫ అవసరమగుచో ఈ సంఘద్వారా వ్యవసాయపు పనిముట్లు సభ్యులకు కొనుగోలు చేయవలయును.

౬ ఈ సంఘసభ్యులు వ్యవసాయశాఖవారితో సంబంధము కలిగి వారి సహాయము పొందవలయును.

౭ ప్రస్తుతము ఈ సంఘమునకు వ్యవసాయ శాఖాధ్యక్షులే కార్యదర్శిగను వారి పర్సనల్ అసిస్టెంటు సహాయ కార్యదర్శిగను నుండవలయును.

౮ ప్రభుత్వమువారు కొంతమొత్తము ఈ సంఘ యాజమాన్యమున సభ్యులలో క్రొత్తపద్ధతులపై సేద్యము చేయు వారికి సహాయము చేయుటకు నంచవలయును.

బహుశః ౮ వ తేది శుక్రవారము సాయంత్రము ౪ గంటలకు మహాజనసభ జరుపుటకు తీర్మానింపబడెను. అందు ఈ కమిటీవారు సిద్ధపరచిన నియమావళి మున్నగునవి ఆలోచింపబడును.

## బాలభటోద్యమము

(ఒక అభిమాని)

బాలభటోద్యమము మొదట పశ్చిమ తీరమునందుదయించినను, భరతఖండ మందంతట వ్యాపించి, శుక్లపక్ష చంద్రునివలె, అనుదిన ప్రవృద్ధమానమై వెలయుచున్నది. ఇది యూరోపు, అమెరికా, ఆస్ట్రేలియా, ఇటలీ, చీనా, జపాను, మున్నగు స్థలములయందును, భరత ఖండమువందును, అల్లుకొనుటంబట్టి, దీని నిబంధనలు, చర్యలు, చట్టములను కొన్నింటిని గుర్తించవచ్చును. బాలభటుల సంఘమునకు, మొదటపోషకులు మన చక్రవర్తిగారైన జార్జిగారి, ప్రియపుత్రుడగు హిజ్ రాయల్, హైనస్, ది ప్రిన్సుఆఫువేల్సు ప్రభువువీరు కొలది వత్సరములక్రిందటనే, మన హైదరాబాదు, దక్కనుకు విజయము చేసియుండిరి వీరు క్రికెట్టు పోలో, పందెములు, మొదలగువానిలో, ఆరితేరినవారలై యుండుటయే గాక, పాగవోడ, గాలివోడ, పరీక్షలలో గెలచి, ఘనబిరుదలనొందిరి. అట్టివారలు బాలభటు సంఘమునకు పోషకులుగ నుండుట చాలముఖ్యమైనవిషయము, దేశాభివృద్ధికరముకూడను ప్రతిభటుడును, నిందుజేరకముందే నీదిగువ వాగ్దత్తములను, మనస్ఫూర్తిగ జేయవలెను,——

(౧) మర్యాదతోగూడిన నా వాగ్దత్తప్రకారము నా దేవుని యెడలను రాజుగారి యెడలను, దేశముయెడలను, విధేయతతో, కృతజ్ఞను జూపుదును

(౨) అన్ని సమయములందును, ఇతరులకు సహాయముజేయుదును బాలభటుల కేర్పాటు జేయబడిన ఆజ్ఞలను, శిరసా, వహించెదను

ఇట్టి సంఘము, లెచ్చోటనున్నను, జనులు, వీరి యుత్సాహమును, చురుకుదనమును, పరిశుభ్రతను, ఒక్కవిధమైన దుస్తులను ధరించుటను, గాంచి మనోహర చిత్తులై యుందురు ఇంతియగాక వారి పిల్లలను, పైమంచి పద్ధతులతోవెలయు, అంశములను బట్టి బాలభటులనుగాజేసి, భగవద్భక్తియందును, రాజభక్తియందును, దేశసేవయందును, పెరుగునట్లు చేయుచున్నారు ఈసంఘము మూడు భాగములుగ భాగింప బడినది బాలురు ఆయా వయస్సునుబట్టి, ఆ యా తరగతులలో చేర్చబడుదురు

(౧) ౭ నుండి పండ్రెండు సంవత్సరముల ఈడుగలవారువుల్ఫుకబ్బులు (The wolf cubs) శరీర సాధనములందును, ఇతర విషయములందును తర్ఫీదు చేయబడుదురు

(౨) ౧౧ నుండి ౧౭ సంవత్సరములవారు బాయిస్కౌట్లు (The Boy Scouts) వారి ప్రవర్తనలయందును, సేవయందును, తర్ఫీదు చేయబడుదురు

(౩) ౧౭ నుండి, పైబడిన వయస్కులు, స్కౌటువారి మార్గదర్శకులుగాను, దేశాభిమానము, దేశసేవకుగాను, వినియోగ పడుదురు.

వీరు యుద్ధభటులు కాకున్నను, ఆయుధములు వీరి వశమున లేకున్నను, రాజకీయ కార్యములలో, వీరికి ప్రవేశము లేకున్నను, వీరు నలుదిక్కులయందును, గౌరవమును వడసి, దేవుని యెడలను, నృపతీవల్లభులెడలను దేశముయెడలను సద్ధర్మమును జూపుదురు.

మానినులను (తల్లులుగా నెంచుకొని) పిల్లలకును, శక్తిలేనివారలకును, సహాయమువసరమగునపుడు మెప్పుదీయక చేయుదురు.

ప్రతి బాలభటుడును, ఆయాతరగతుల ప్రకారము వారు నేర్చుకొనవలసిన అంశముల నుశ్రద్ధతో నేర్చుకొని, పరీక్షలందేయుట ప్యాసు లిచ్చి గెలుపొందిన పిదప బాడ్జిల (Badge) నొసగి గౌరవింపబడుదురు. ఆయా బాడ్జిల వివరములు దక్కను స్కౌట్సు సెప్టెంబరు 1930 లో ప్రచురింపబడినవి. ఇది దక్కనులోనున్న బాలభటుల సంఘమున కేర్పాటు జేయబడెను. ఈసంఘమునకు పవిషయమునందైనను, ద్రవ్యలోపము కలిగిన యెడల ఎంతమాత్రమును, యాచించుటకు వీరియ్యకొనక, దేశాభిమానులను, సంతసింపజేయు కొన్ని యాటలతోను, శ్వార సాధనముల తోను, నవ్వులతోగూడిన సంభాషణల (From Shakespeare etc)తోను, టిక్కెట్లమూలముగ ద్రవ్యమార్జించి ఆయా లోటులను పూర్తి జేయుదురు.

బాలభటులు యూనియన్‌జాక్ (Union Jack) పతాకము నెత్తవలయునో దానిరంగు వారి స్కౌటుమాస్టరుల వలన నేర్పబడును, వీరికి ఊదెడి ఈల (whistle), తెల్లని త్రాడు, ఒకకత్తి (Pen knife) చేతికర్ర, నడుముకు బెల్టు మున్నగునవి అవసరములు వీరు మార్సు (Morse) సిగ్నలు, బావుటాసిగ్నలు, దీపముతో రాత్రిజామసిగ్నలు మున్నగునవి నేర్చియుందురు ఉరమంటలనార్పుట (Fire Brigade) గాయములు పొందినవారల నెత్తుకొనిపోవుట పాకశాస్త్రము కట్లుకట్టుట [Firsh aed] తగు మూలికాసాధములను, నేర్చియుందురు

జంతు, పక్షి, మృగజాతులయందు వాత్సల్యమును జూపుదు వాని కపాయము కలుగకుండ ప్రయత్నింతురు. ఇట్టివారలే బాలభటులనంబడుదురు. నిజాంసర్కారువారు ఎంతో దయతో నీ బాలభటుల సంఘాభివృద్ధికొరకు సైఫాబాదులో నొక, హెడ్డుక్వార్టర్సు (Head Quarters) నేర్పాటు జేయించి బహునిపుణతతో, నీకార్యమును వృద్ధిజేయు నుద్యోగుల నియమించి, దక్కను రాజ్యమందంతటను ఈ బాలభటుల సంఘము వృద్ధియగునట్లు ఏర్పాటులు జేసియున్నారు. ఇట్లు జేయుటవలన కొలదికాలములోనే ఎట్టి మూఢ బాలురైనను, బుద్ధికుశలతయందును, జ్ఞానాభివృద్ధియందును, అభివృద్ధి నొందెదరనుటకు సందియము లేదు మనము స్కూళ్లయందు బాలభటులభివృద్ధి గాంచుచున్నారు. పల్లెలలోనున్న బాలురు వీరినిజూచి ఆశ్చర్యము నొందుచు సంతసింతురు మిషన్ స్కూళ్లలో నున్న బాలికలు గైడు (Guides) లందురు. వీరు పిల్లలకు తిన్నని నడువడియును, శారీరక వ్యాయామమును దృఢగాత్రులగునట్లును దైవభక్తి మాతృభక్తి అనాథులయెడల కరుణా హృదయమును జూపుటయును నీతులను నేర్పుదురు. రాణిమేరిగారికుమార్తెయగు, హర్ హైనస్ ప్రిన్సెస్ ఇలియానా ఆఫ రోమేనియాగారు ఈగర్ల్సుగైడుకు పెద్దగా నెన్నుకొనబడిరని తెలియుచున్నది.

హైదరాబాదు దక్కను రాజ్యములోనున్న ఉపాధ్యాయులసంఘములోని యువ్వకులు కొందరు పట్టపరీక్షలందు తీర్ణులైయుండుట మాత్రముగాక, వారు దక్కను రాజ్యపు (Deccan Scouts) బాలభటుల సంఘములో జేరినవారును తమకన్న చిన్నవారలైన, బాలభటుల మాతకొమ్మలవంటివారైయున్నందున, సామర్థ్యులు ఇట్టి పట్టుదలతోనే, ఈ కార్యము కొనసాగించుచున్న దక్కనురాజ్యములోని, బాలభటులసంఘము మెంతో అభివృద్ధి నొందుననుటలో సందియము లేదు.

